# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి
అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిస్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాత పేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

## వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము
1969



సంపుటి
29



సంచిక
6



ఫిబ్రవరి - 1998



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

# మహావధానులు

గుప్తగారంటే,

యశఃకాయులైన శ్రీ దోమావెంకటస్వామి గుప్తగారు.

కేవలం అవధానులేకాదు. మహావధానులు. పూర్ణప్రజ్ఞులు - అర్యజనసుధార్ణవసోములు.

సాహిత్యచరిత్రలో వైశ్యజాతిస్థానాన్నీ, యశస్సునూ సుప్రతిష్ఠితం చేసిన అతి ప్రసిద్ధుల్లో ఒకరు.

'సాహిత్యము జాతికి జీవగఱ్ఱ'. 'సప్తసంతానాల్లో ఖిలము కాకుండునట్టిది దాత్రి కృతి' - ఈ వాక్యాలను గమనించాల్సిన విద్యుక్తాన్ని విస్మరించిన వైశ్యులు గుప్తగారినీ, ఆయన ఘనతనూ గుర్తించలేకపోయారు. ఖిలము అంటే చెడిపోవుట.

జాతిసర్వతోముఖాభివృద్ధియెడ సరియైన అవగాహనగల నాయకత్వాన్ని ఎన్నుకోలేక పోవడమూ,

శుష్కనినాదాలకూ - శుష్కవాగ్దానాలకూ మురిసి మైమరచిపోవడమూ,

ధనబలాన్నీ - డాంబికాన్నీ - దర్పాన్నీ - డాంబిక ప్రచారాన్నీ చూచి మెచ్చుకొని - కర్తవ్యాన్ని గుర్తించ లేకపోవడమూ - ఇత్యాదులు ఇందుకుకారణాలు.

రాజకీయ - సామాజిక - ధార్మికరంగాలవలెనే సాహిత్య రంగమూ విస్మరించరానిదే. ప్రాధాన్యత ఇవ్వవలసిందే. కాబట్టి సాహితీరంగములో కూడ తమజాతి గతకాలపు స్థానాన్నీ, వైభవాన్నీ భద్రపరచుటకు సాహిత్యపరంగా జరుగు కార్యక్రమాలకు సహక రించటంకూడ తమ విధి - అని ఇకనైనా వైశ్యులు గుర్తించాలి.

గుప్తగారు కర్మకొద్దీ వైశ్యుల్లో పుట్టారు. అదే - అంతటివ్యక్తి మా కులములోనే పుట్టి వుంటే ........... ఆయన్ను ఆకాశానికిఎత్తేవారము. బ్రహ్మరథము పట్టేవారము. అని వైశ్యేతరులొకరు ఈ పత్రికా సంపాదకులతో అన్నారు. ఈ మాటలు ఇక్కడ ఈ సంపాదకీయములో వైశ్యులను కించపరచాలని వ్రాయలేదు. ఒకవ్యక్తిలోని గొప్పతనాన్నీ, ఒకవ్యక్తి ఒక రంగములో చేసిన విశేషకృషినీ - విశిష్టతేనూ, వైశ్యేతరులు ఎంతబాగా గుర్తిస్తారో, బేరీజు వేసుకొనుటకే ఇక్కడ ఉటంకించాల్సి వచ్చింది - క్షమించండి.

'వైశ్యులు వ్యక్తియొక్క యోగ్యతను రూపాయల్తో కొలుస్తారు' - అని 'శ్రీ పెండేకంటి' అనేవారు.

అందుకే - 'ఈ జాతికి ఈ కృతఘ్నతాపాపం అంటకూడదు' - అనే ఈ పత్రికాసంపాదకులు కడపలో 'శ్రీ దోమావెంకటస్వామిగుప్త సాహిత్యపీఠము' ను స్థాపించింది.

సాహిత్యచరిత్రలో వైశ్యజాతిస్థానాన్ని సుప్రతిష్టితం చేయుటద్వారా శ్రీ వెంకటస్వామిగుప్తగారు వైశ్యజాతికి గొప్పఉపకారం చేశారు - ఉపకారము అంటే మేలు. చేసిన మేలును గుర్తించుకోవడము కృతజ్ఞత. విస్మరించడం కృతఘ్నత. 'కృతఘ్నునిమాంసం కుక్కలు తినగారోయున్' -అని భారతము.

గుప్తగారి ముద్రిత - అముద్రిత గ్రంథాలను ప్రచురించాలనే కార్యక్రమమే ప్రధానఊపిరిగా సాగుచున్న శ్రీ దోమావెంకటస్వామి గుప్త సాహిత్యపీఠమునకు తమంతట తామే స్పందించి- పీఠానికి ఆర్థికంగా సహకరించడం ప్రతివైశ్యుడూ తన విధి అని ఇకనైనా భావించాలి.

## శ్రీ మేడానరసింహ్మలుగారికి 'సేవారత్న' బిరుదప్రదానం



హైద్రాబాద్ పట్టణప్రముఖులూ, ప్రసిద్ధభవననిర్మాతలూ - 'నిర్మాణరత్నా'ది పలు బిరుదులచే ప్రకాశితులూ, రాష్ట్రవైశ్య సంస్థలసమాఖ్య పూర్వఅధ్యక్షులూ శ్రీ మేడానరసింహ్మలు గారికి హైద్రాబాద్ ప్రధానకార్యస్థానంగా గల రాష్ట్రవైశ్య సంస్థలసమాఖ్య 'సేవారత్న' అను బిరుదును ఇచ్చి సత్కరించింది. శ్రీ నరసింహ్మలుగారు తన షష్ఠిపూర్త్యుత్సవాన్ని ఘనంగా జరుపుకొన్న సందర్భాన్ని పురస్కరించుకొని ఈ బిరుదును 9-2-1998వ తేదీ రాత్రి 9 గంటలకు హైద్రాబాద్ పట్టణము సోమాజీగూడలోని జయాగార్డెన్సులో జరిగిన బిరుదప్రదానసభలో శ్రీ నరసింహ్మలుగారు ఈ బిరుదును స్వీకరించారు.

# ప్రథమసత్యాగ్రహి "వాసవి"

అహింస, కరుణ - ఈ రెండే ప్రపంచానికి శాంతిని ప్రసాదిస్తాయి.

'వాసవి' అవతారములోనిప్రధాన ధ్యేయం ఇదే.

అహింస, కరుణ ఈ రెండూ విడదీయుటకు వీలుకానివి. కరుణ కలవాడు హింసను చేయలేడు. హింసచేయడము కనికరము లేక దయ లేని మనస్సు ఉన్నపుడే సాధ్యము.

'హింస' అంటే ఒక నిండుప్రాణాన్ని తీయడమేకాదు. త్రికరణశుద్ధిగా మరో ప్రాణికి హాని కలిగించకుండుటా. మనస్సును నొప్పించ కుండుటా.

వర్ణాశ్రమాచార ధర్మసంరక్షణము 'వాసవి' అవతారములోని మరో ముఖ్య విశేషం.

అహింసనూ - కరుణనూ భువిలో స్థాపించి, అజ్ఞానాన్ని పారద్రోలి - భువిని దివిగా చేయుటకే శ్రీ కన్యకాపరమేశ్వరి వాసవిగా తేనెలొలికే ఈ తెలుగుగడ్డపై జన్మించింది.

'కన్యక' ఆదిశక్తికిగల పద్నాలుగు నామాల్లో ఒకటి. 'కన్యక' అను పదానికి 'పరమేశ్వరి' అను పదాన్ని జోడించుటవలన 'కన్యకాపరమేశ్వరి' అయింది. పరమ + ఈశ్వరి = పరమేశ్వరి. పరమ అనగా పరమాత్మ. పరమ అను ఈ పదాన్నే విశేషణంగా వాడితే ఆద్యము, ఉత్కృష్టము, ప్రధానము అను అర్థాలు వస్తాయి.

"ఓం కాత్యాయనాయ విద్మహే, కన్య కుమారిధీమహి, తన్నోదుర్గి ప్రచోదయాత్ (నారాయణమ్)" అను నారాయణీయములోని ఈ మంత్రము శ్రీ కన్యకా పరమేశ్వరి ఒక ప్రధానదైవతము అని చెప్పుటకు తోడ్పడుచున్నది.

తెలుగుకన్నెలు మానసంరక్షణ కొఱకు ప్రాణాన్ని సహితమూ తృణప్రాయంగా విడుస్తారు - అనే గొప్ప విషయాన్ని 'వాసవి' ప్రపంచానికి చాటిచెప్పింది.

పద్దెనిమిది పట్టణాలతో కూడిన గణతంత్ర వ్యవస్థకు 'బృహదద్రి' ప్రధానకార్యస్థానము. ఆ వ్యవస్థకు అధినేత కుసుమార్య ప్రభువు. ఆయన భార్య కుసుమాంబ. వీరిద్దరి వరాలపంటగా, పుత్రకామేష్టి యజ్ఞఫలంగా వాసవి జన్మించింది. 'బృహదద్రి' అను పదమునకు తెలుగు రూపమే పెనుగొండ. పెను + కొండ = పెనుకొండ. ఇక్కడ పెను అను పదము విశేషణము. విశేష్యము యొక్క ధర్మమును తెలిపెడి శబ్దము విశేషణము. విశేష్యము అంటే వస్తువాచకము యొక్క ధర్మమును తెలుపునది. కొండ అనగా మల, పర్వతము అని అర్థము. కొండ అను పదమునకు పెనుశబ్దము విశేషణము. కొండ విశేష్యము. బృహదద్రిలో బృహత్ అన్నునది విశేషణము. అద్రి అంటే పర్వతము. పెను శబ్దము వలెనే బృహత్ శబ్దమూ విశేషణమే. ఈ రెండూ కూడ విశేషణపూర్వపదాలు. పెనుకొండ

కాలక్రమములో పెనుగొండ అయింది ఇప్పటి పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకు పట్టణానికి దగ్గరగా ఈ పెనుగొండ ఉన్నది. పెనుగొండ అసాధురూపము పెనుకొండ సాధురూపము.

గణతంత్ర వ్యవస్థ అనగా అచ్చమైన ప్రజాస్వామిక వ్యవస్థ. గణవ్యవస్థలో రాచరికపద్ధతి ఉండదు. వంశపారంపర్య రాజ్యాధికారానికి అవకాశం ఉండదు. ఒక గణవ్యవస్థకు చెందిన ప్రజలెల్లరూ సమావేశమై - తమలో యోగ్యుడైనవాన్ని నాయకునిగా, అధినేతగా ఎన్నుకొంటారు. కుసుమార్యప్రభువు ఇలా ఎన్నుకోబడిన వాడే. జనరంజకంగా, ఆ ప్రజల ఆశలకూ, అభిప్రాయాలకూ అనుగుణంగా పరిపాలనను చేయగలిగినంతవరకే ఆత నాపదవిలో ఉంటాడు. ప్రాచీన భారత దేశములో క్రీ. శ. 5, 6 శతాబ్దాల వరకూ కూడ ఈ గణవ్యవస్థలు ఉన్నట్లుగా చరిత్ర చెప్తుంది. యమున, హిమాలయాలకు మధ్యన క్రీ. శ. 350 - 400 సంవత్సరాల మధ్యన కొనసాగిన యౌధేయగణవ్యవస్థ ఆనాటి బలమైన గణవ్యవస్థల్లో ఒకటి. సముద్రగుప్తుడు ఈ యౌధేయగణవ్యవస్థను నిర్మూలించేందుకు ప్రయత్నించగా ఐక్యతతో వ్యవహరించిన ఆ ప్రజలు ఆయన ప్రయత్నాన్ని శక్తివంతంగా ఎదుర్కొని ఆయన్ను విఫలమనోరథున్ని చేశారు.

గణవ్యవస్థల్లో పొలాలు ఉమ్మడిఆస్తిగా పరిగణింపబడవు. వ్యవసాయము - వ్యాపారాది వృత్తుల్లో ఎవరిఆదాయము వారిదే. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు ఎటువంటి తేడాలు లేకుండా ఒక్కటిగా జీవిస్తారు. స్వాతంత్ర్య ప్రియత, ఆత్మగౌరవ భావనాధిక్యత గణవ్యవస్థల్లోని స్త్రీపురుషుల్లో మిక్కుటంగా ఉంటాయి. వారు సర్వనాశనానికి కూడా సిద్ధపడేవారేకాని ఆత్మగౌరవాన్నీ, స్వాతంత్ర్యాన్నీ పోగొట్టుకోడానికి ఒప్పుకోరు. నిరంకుశులైన రాజులకు గణాలు కంటి నలుసుగానే ఉంటాయి. బహుజనహితం కొఱకు ఈ వ్యవస్థలు తదేకదీక్షతో పనిచేస్తాయి.

వాసవి జననం - కలియుగము ప్రారంభమైన తర్వాత 2628వ సంవత్సరము (క్రీ. వె. 473)లో జరిగినట్లుగా ప్రసిద్ధ జ్యోతిషశాస్త్రవేత్తలు స్వర్గీయ చేబ్రోలు రోశయ్యగుప్తగారు అపారమైన తన జ్యోతిష విద్యాపాండిత్యముతో నిర్ణయించారు. ఖగోళమందు ఆయాకాలలో గల గ్రహస్థితి ఆధారంగా కాలనిర్ణయము చేయడము కూడ ఒకపద్ధతి.

దీనులనూ, రుజాపీడితులనూ, దుఃఖితులనూ చూచినపుడు వాసవి మనస్సు ఎంతగానో క్షోభించేది. తండ్రికి చెప్పి అట్టివారి బాధలను పోగొట్టుటకు ప్రయత్నించేది.

వాసవి హృదయం సుతిమెత్తనిది. ఒక పుష్పము - అది ఎంతరమణీయమైనదైనా - దాన్ని కాడ నుండీ వేరుచేసేదికాదు. ఈ ప్రకృతిలో వృక్ష తరు లతా గుల్మాదులు పుట్టుటకు ఈ పువ్వులు కారణభూతములని ఆమె చెప్పేది.

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులనెడి అరిషడ్వర్గాలకూ

తగుల్కొని, తమ్ముతాము తెలుసుకోలేక నిరంతర స్వార్థపీడితులై శోకాన్ని కొని తెచ్చుకొనుచున్న మానవకోటి సముద్ధరణకై ఆమె అనేక విధాలా ప్రయత్నించింది.

హింసాప్రవృత్తే మానవుల సర్వదుఃఖాలకూ మూలము. రాగము, ద్వేషము, ఈర్ష్య, అసూయ ఈ హింసాప్రవృత్తికి మూలకారణాలు.

హింసను - హింసతోకాక అహింసతో నిర్మూలించాలి. అహింసయే పరమ ధర్మము అని వేదవాక్యము. వాసవి ఈ పద్ధతిలోనే హింసానిర్మూలనకు ప్రయత్నించింది.

తనను - ధర్మవిరుద్ధమనక బలవంతంగా పొందుటకు ప్రయత్నించిన విష్ణువర్ధననరేంద్రుని ఎదుర్కొని, తృటికాలములో నిర్జించగల సైన్యసంపద - బల పరాక్రమాలు - ప్రజాభిమానము - తనతండ్రికి పుష్కలంగా ఉన్నా అందుకు తన తండ్రిని వాసవి ప్రోత్సహించలేదు. విరూపాక్షుడు తన సోదరుడు. అవక్ర విక్రముడు - అరివీరభయంకరుడు. అయినా ఆమె అందుకు అవకాశం యివ్వలేదు. సంగరమంటూ జరిగితే ప్రాణిహింస జరగక తప్పదు. హింసవల్ల అహింస శాశ్వతముగా నశించదు. అని ఆమె సిద్ధాంతము. ఈ సిద్ధాంతానికి కట్టుబడే వాసవి ప్రభవనామసంవత్సర మాఘశుద్ధవిదియన ఆత్మార్పణ చేయగా ఆమెతో బాటు రెండువందలనలుగురు ఆత్మార్పణ చేశారు. వారి ఆత్మార్పణావార్త విష్ణువర్ధనునిలో మానసిక పరివర్తనను కలిగించింది. ఇంతలో - తాను 'కారణజన్ముడను' అను గతము గుర్తుకు రాగానే ఆయన విగతజీవులయ్యారు.

కత్తిని కదల్చకుండా - విశిఖాన్ని విడువకుండా - ఒక్కరక్తపుబొట్టుకూడ చిందకుండా సాగిన వాసవి అహింసాపద్ధతి అంధకారబంధురమైన ఈ జగత్తులో అహింసాజ్యోతిని వెలిగించింది. గాంధీజీ - పొట్టిశ్రీరాములకు ఆదర్శప్రాయమైంది. సత్యాగ్రహంగా పిలువబడింది. భౌతిక నాశనము చేయక, మనస్సును మార్చి, హృదయమందలి కాలుష్యమును కడిగివేయు సాధనము సత్యాగ్రహము. ఇందుకు ఆత్మత్యాగమే పునాది. త్యాగము ఫలించుటకు సత్యము పాదుగాగల హృదయనైర్మల్యము పునాది. తన హృదయ నైర్మల్యముతో, పరుల హృదయాలలోని కాలుష్యమును కడిగి వైచుటతో అతనిని జయించును. సత్యము స్థాపించబడును. ఇదే సత్యాగ్రహము. ఈ నిగూఢధర్మ సూత్రమును ఆచరణలో చూపించుటే వాసవి ఆత్మార్పణలోని ముఖ్యోద్దేశ్యము.

1962వ సంవత్సరమున చెన్నైలోని శ్రీ కన్యకాపరమేశ్వరీదేవ్యాలయములో వాసవీచిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ అప్పటి భారతఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణ పండితులు "ప్రపంచములో ప్రథమ సత్యాగ్రహి వాసవి" - అని ప్రస్తుతించారు.

ఆత్మార్పణానంతరము వాసవి శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవిగా ఈ భువిలో పూజలందుకొంటూ ఉంది.

ఒక పవిత్రలక్ష్యసాధకు అసువులర్పించిన వారిని మహనీయులుగా - మహాత్ములుగా - దైవతములుగా ఆరా

ధించడము భారతీయసంస్కృతిలో ఒక భాగమే.

నెల్లూరుజిల్లాలో గల 'నలజారమ్మ' దేవత కూడ ఈ విధంగా ఒక పవిత్ర లక్ష్యసాధనకు అసువులర్పించిన మహనీయురాలే. కవికోకిల స్వర్గీయ దువ్వూరు రామిరెడ్డిగారు ఈ నలజారమ్మకథను బహుకమ్మని పద్యాలలో కావ్యంగా వ్రాశారు.

ఒక సుల్తాను పన్ను విధించుటలో అనుసరిస్తున్న అత్యంత అనుచితమూ, అతిహేయమూ అగు పద్ధతిని వీరోచితంగా ఎదుర్కొని అసువులు బాసిన ఒక అతివ వరంగల్లు జిల్లాలోని బమ్మెరగ్రామములో దేవతగా పూజలందుకొంటూ ఉంది.

క్రీస్తుకు పూర్వము 450 - 600 వందల ప్రాంతము భారతదేశములో కరుణారసము పొంగిపొర్లిపారినకాలము. కరుణాసముద్రులైన వాసవీ - బుద్ధభగవానుడూ జన్మించింది ఈ కాలములోనే. బుద్ధభగవానుడు రెండువేల ఐదువందల సంవత్సరాల (క్రీ. పూ. 563) నాడు జన్మించినట్లుగా చారిత్రకులు వింగడించారు. వాసవి జన్మించింది క్రీ. పూ. 473లో. అంటే ఇంచుమించు వందసంవత్సరాలు అటూ ఇటుగా వాసవీ - బుద్ధులు జన్మించారు. లక్ష్యసాదృశ్యముకల ఇరువురు వ్యక్తులు ఏకకాలములో, భిన్నప్రాంతాల్లో జన్మించి ప్రజలను ధర్మమార్గమున నడిపించిన సంఘటనలు భారతదేశ చరిత్రలో పలు కన్పిస్తాయి.

వాసవి-బుద్ధుడు వీరిర్వురూ అహింస-కరుణలను భూమిపై స్థాపించుటకే కృషి చేశారు. అజ్ఞానాన్ని పారద్రోలమన్నారు. కలతలతో - నలతలతో అలతపడే మానవులకు శాశ్వత సుఖశాంతులు ప్రసాదించేవి అహింస - కరుణే అని వారి ప్రబోధము.

"హింసారహితమూ, కరుణాపూరితము అగు జగత్తులో ప్రశాంతి వెల్లివిరుస్తుంది' - అను ఆలోచన బుద్ధునిలో కలగడానికి కారణము వాసవి ఇచ్చిన ప్రబోధమే అని కొందరు భావిస్తున్నారు. వారు తమ భావనలకు డాక్టర్ రాధాకృష్ణన్ చెప్పిన "ప్రపంచములోనే ప్రథమ సత్యాగ్రహి వాసవి'' అనుమాటలను ఆధారంగా చెప్తారు.

వాసవి దక్షిణభారతములో అవతరించింది. బుద్ధుడు ఉత్తర భారతములో జన్మించాడు. కుసుమగుప్తుడు తెలుగు దేశములోని పెనుగొండకు అధినేత. బుద్ధుని తండ్రి శుద్ధోదనుడు హిమాలయ పర్వతశ్రేణికి దిగువన మగధకు వాయవ్యాన గల కపిలవస్తుపురానికి అధిపతి. కపిలవస్తు పురం కూడ గణవ్యవస్థకు చెందిన రాజ్యాలకు ముఖ్యపట్టణమే.

బుద్ధచరిత్ర బుద్ధపురాణము అయినట్లే వాసవీచరిత్ర వాసవీపురాణం అయింది.

బుద్ధుని భగవంతుని ఏకవింశత్యవతారాలలో ఒక్కటిగా చెప్పినట్లే - వాసవి ఆదిశక్తి అవతారాలలో ఒక్కటిగా చెప్తున్నారు.

సత్య, ధర్మములకు కలుగు విచ్ఛిత్తిని అపుటకు వాసవి ఆత్మార్పణ చేసిన ఈ మాఘశుద్ధవిదియను ఆమెను ఈ విధంగా సంస్మరించుకోవడం ఆమె ఎడ మనం చూపవలసిన కృతజ్ఞతను ప్రకటించుకోవడమే.

గాంధీమహాయోగి నియోజితాస్త్రం
సత్యాగ్రహో దౌష్ట్య వినాశనార్థం
తస్యప్రయోక్త్రి ప్రథమా త్వమేవా

త్వయా సమానా భువి నాస్తి నాస్తి

లోకంలోని దౌష్ట్యాన్ని నాశనం చేయ డానికి గాంధీమహాత్ముడు సత్యాగ్రహము అనే అస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ సత్యాగ్రహము అనే అస్త్రాన్ని ప్రపంచములో మొట్టమొదట ప్రయోగించింది నీవే. అట్టి నీకు సమానమగువారు ఈ భూమిలో లేరు. లేరు.

"తనదునిర్మలధర్మవర్తనము చేత
మహితమహిళామతల్లికా మణుల యందు
అమలమార్గ ప్రదర్శినియై వెలుంగు
వాసవీమహాదేవికి వందనములు".

శ్రీ వాసవీ ఆత్మార్పణదినోత్సవ సందర్భంగా 30-1-1998న కడప ఆకాశవాణీ కేంద్రమువారు ఈ ప్రసంగ వ్యాసాన్ని ప్రసారం చేశారు.

(కడప ఆకాశవాణీ సౌజన్యముతో)

## వెంపటివరలక్ష్మి అప్పారావు చారిటబుల్ ట్రస్టువారి ఈ సంవత్సర ఆర్థికసహాయం

గుంటూరుజిల్లా దాచేపల్లిలోని పైట్రస్టు వారు, చలివేంద్రనిర్వహణకు 3 వేలు, పేదల అన్నదానానికి 4 వేలు, పేదపిల్లల పుస్తకాలకు 21/2 వేలు, వస్త్రదానానికి 11 వేలు, వ్యాధిగ్రస్తులకు రొట్టెలు, పాలు పంచుటకు వెయ్యి, పేదల వివాహమునకు వెయ్యి, పేదవిద్యార్థుల సహాయానికి వెయ్యి ఇంకా మరికొన్ని ధార్మిక కార్యక్రమాలకు కలిసి 30 వేల రూపాయలను ఖర్చు చేశారు. ఈ ట్రస్టు కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగుటకుగాను ఈట్రస్టువారు 2 లక్షలరూపాయలను మూలధనంగా సేకరించారు.

## సులభశైలిలో ఎంతో చక్కగా సాగినది మీ ప్రసంగవ్యాసం

చిరంజీవి లక్ష్మీకాంతంశ్రేష్ఠీ!

30-1-1998న కడపఆకాశవాణీ కేంద్రమువారు ప్రసారంచేసిన "ప్రథమ సత్యాగ్రహివాసవి" అను మీ ప్రసంగాన్ని వినలేకపోయాను. కానీ, మీరు పంపిన ఆ ప్రసంగవ్యాసం చదివాను. తెలుగులో - సులభశైలిలో ఎంతోచక్కగా సాగిన ఈ వ్యాసంచాలాబాగుంది. భావముఅద్భుతం. వాసవిని మనము పూజించడం - ఆమెవలె త్యాగధనులను పూజిస్తున్నారని చెప్పడం మరింత బాగున్నది. బుద్ధుడు - వాసవి కాలాన్ని సరిగ్గా పొందుపరచి వారిర్వురి ఉద్దేశ్యాలూ ఒక్కటే అని చెప్పడంలో వాసవి అవతారధ్యేయప్రశస్తిని చాటింది. ఇటువంటి వ్యాసాలు ప్రజలను మేల్కొలిపి వారిని ధర్మమార్గాన నడిపించుటకు తోడ్పడుతాయి. మీ శైలి ద్రాక్షాపాకము. చదివేవారి హృదయాలలో హత్తుకొనే విధంగా వ్రాసేశక్తి మీకు అమ్మ ఇచ్చిన వరము. ఇంతకుముందటి వ్యాసాలనూ, ఇకముందు వ్రాసే వ్యాసాలనూ కలిపి ఒక పుస్తకంగా ముద్రించండి. ప్రజలకు తోడ్పడుతుంది. పాఠ్యపుస్తకంగా ఉండ గలదిగా ఉంటుందికూడ.

ఆశీస్సులతో
కె. రాధాకృష్ణయ్య
కల్లూరు. 31-1-98.

# శ్రీ దోమావెంకటస్వామిగుప్త

డా. సి.వి.సుబ్బన్న, శతావధాని.

ప్రాక్పండితోత్తమైః క్లప్తం సర్వకళా సముజ్జ్వలమ్
అవధానేతికీర్తితం అస్మద్గోత్రంచ వర్ధ తామ్

ఇది నా ఆశంస. అవధాన మనేది ఒకగోత్రం. ఆద్యులయిన పండితోత్తములు గోత్రకర్తలు. మూలపురుషుడు శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారు. వీరు తర్క వ్యాకరణ మీ. మాంసాజ్యోతిశ్శాస్త్ర పారంగతులు. అభినవపండితరాయ ప్రసిద్ధులు. సంగీతనిధి. ఏకసంథాగ్రాహి.

ఆచార్యులవారి అనంతరం అవధాన విద్యకు నిర్దిష్టమైన రూపురేఖలు తీర్చినవారు శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు. ఈ జంటకవులలో దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి పద్యం గ్రాంథికశైలి. చెళ్ళపిళ్ళవెంకటశాస్త్రిగారి పద్యం వ్యావహారికశైలి. చెళ్ళపిళ్ళవారు మంచిమాటకారి. జనమును బాగా ఆకట్టుకొనేవారు. శ్రీ విశ్వనాథసత్యనారాయణ గారు 'వానకున్ తడియనివారు మద్గురు వధానమరందమ్మృదూక్తిధారలో కడుగని వారు మాకెవరు కానగరారిల తెల్గునాడునన్.' అన్నారు. తిరుపతి వెంకటేశ్వరుల కాలంలో అవధానాలకు అంత ప్రాచుర్యం కలిగింది.

ఖద్దరు టోపీ ధరించిన వారందరు గాంధీగారి శిష్యులన్నట్లు, అవధాని అని పేరు పెట్టుకొన్న వారందరూ తిరుపతి వెంకటకవుల శిష్యులమని చెప్పుకొన్నారు. ఏకలవ్యశిష్యులే ఎక్కువ. చెళ్ళపిళ్ళవారి శిష్యులలో అగ్రగణ్యులిద్దరున్నారు. ఒకరు విశ్వనాధసత్యనారాయణగారు. మరొకరు వేలూరుశివరామశాస్త్రిగారు విశ్వనాధ వారు, చెళ్ళపిళ్ళవారు బందరు హైస్కూల్లో తెలుగు పండితులుగా ఉన్నపుడు స్టూడెంటు. వేలూరివారు అపరపతంజలి ప్రసిద్ధులు శ్రీ జయంతిభగీరధశాస్త్రుల వారివద్ద భాష్యాంతవ్యాకరణం చదువుకొన్నవారు. చెళ్ళపిళ్ళవారి వద్ద కేవలం అవధాన శకటం లాగే వైనం మాత్రం చూచి నేర్చుకొన్నవారు. తిరుపతివెంకటేశ్వరులు అవధానసామ్రాజ్యభారం వేలూరివారి కప్పగించిరి. వేలూరివారు మెత్తబడి, నేనిక మోయలేను. ఎవరిమీదనైనా మోపుదామనుకొంటే తగినవాడు దొరకలేదని చింతించిరి. తగినవాడు అంటే శాస్త్రపాండిత్య ధురంధరుడు.

తిరుపతివేంకటేశ్వరకవులు గురు పీఠంగా చెప్పుకొని, అవధానయాత్రలు సాగించినవారు అనేకులున్నారు. కోస్తా జిల్లాలో వెల్లివెరిసిన ప్రవాహాన్ని రాయల సీమలో గూడ ఉత్కటంగా పొంగించిన అవధానివర్యుడు శ్రీ దోమావెంకటస్వామి గుప్తగారు.

గుప్తగారు క్రీస్తుశకం 1899 సంవత్సరంలో కర్నూలులో జన్మించినారు. 1918 సంవత్సరంలో కర్నూలు ప్రాంతంలో కలరావ్యాధి విజృంభించింది. ఆ అలజడిలో అపాయము జరుగకుండ,

సరస్వతీదేవి గుప్తగారిని గుంటూరు చేర్చింది కీడులో మేలు అంటే ఇదే

అప్పటికే పద్యాలు వ్రాస్తున్నారు అవధానాలు చేస్తున్నారు. ఈ విషయం వారే వ్రాసుకొన్న పద్యం వల్ల తెలుస్తుంది. "పదకొండేండ్ల వయస్సునుండి కవితా వ్యాపారమున్ బూనియున్ పదియారేడుల యీడునుండి అవధానంబుల్ రహిన్ జేయుచున్" అన్నారు. పదకొండేండ్ల బాలకుడు కవిత్వం చెప్పగలడా? అంటే, ప్రాగ్జన్మసంస్కారం ఉంటే చెప్పగలడు.

క్రీ.శ. 1890లో కావ్యకంఠగణపతి పదకొండేండ్ల బాలకుడు పండితసమక్షంలో 'పాండవ ధార్తరాష్ట్రసంభవం' అనే లఘు ప్రబంధం ఒకగంటలో ఆశువుగా చెప్పి నాడు. ఒకశ్లోకం చూడండి. కుంతి మంత్రం చెప్పింది. సూర్యుడు దిగివచ్చినాడు. 'న సా మిత్రం వశీచక్రే కేవలం విద్యయా తయా, కేతకీకళికాకాంతైః కోమలై రంగకైరపి.' సూర్యుని కేవలం మంత్రంతోనే కాదు, మొగలిపూమొగ్గల కాంతులు చిమ్మే కోమలములైన అంగములతోనూ వశీక రించుకొన్నదట. ఇది పదకొండేండ్ల పిల్లవాడు భావించి పలికే ఫణితిబంధమేనా? సహజకవియైనవాని వాక్పరిణతి యిట్లుం టుంది.

ఇక పదునారేడులనుండి అవధానాలు 'రహిన్' జేయుట. ఇదీ ఆశ్చర్యకరమే. షోడశాబ్దముల బ్రహ్మచారికి లోకజ్ఞత తక్కువే. అప్రస్తుత ప్రసంగం అడుగడున చమత్కారం పండిస్తు నడిపించవలె.

అవధాని బెల్లంకొట్టిన రాయివలె కూర్చుంటే సభ నిద్రపోతుంది.

గుప్తగారికి ఆలోపం లేదని చెప్పవచ్చు. 25వ యేట అంటే పహిలా పచ్చీస్‌లో, అప్రస్తుతప్రసంగికి మంచి సమాధానం చెప్పినారు. చిల్లర బేరం చేసుకోక యీ వ్యాసంగమెందుకు పెట్టుకొన్నావు? అని ప్రశ్న. దానికి పద్యంలో సమాధానం.

బేరము నాకు నచ్చినది. బేరము వీడను నేనుగూడ, నా

బేర మనంగ భవ్యసభ పేరిట అంగడి, సత్కవిత్వ వి

స్ఫారతరావధానపు ప్రదర్శనవస్తువు బెట్టి యిందుకున్

గోరుట మూల్యమున్ బ్రతుకుకోస మనందగు, నేను వైశ్యుడన్

మీరిట గోర చెప్పితిని, మీసము గల్గిన ఈసడింపుడి.

ఇదీ చిల్లరబేరమే. సభ అంగడి. కవిత్వం వస్తువు. సత్కారం మూల్యం. విషయమంతా ఉత్పలమాలికావృత్తం నాలుగు చరణాలలోనే వచ్చింది. అయిదవ చరణం మీసం కోసం వచ్చింది. ఈసడించ వలసిన అవసరం లేదు కనుక చిరునవ్వు లతో సభ ముగిసింది.

బ్రతుకుకోసం అవధానాలు నిర్వ హిస్తున్నట్లు చెప్పుకొన్నారు. నిజానికి కవిత్వం ప్రధానవృత్తి కాదు. కర్నూలుజిల్లా కోవెల కుంట్లలో కొంతకాలం తెలుగు పండితు లుగా పనిచేసినారు. తరువాత కంచి, మద్రాసు, శ్రీ పెరంబూదూరు పాఠశాలల్లో పనిచేసినారు. మద్రాసు క్రైస్తవకళాశాల లోను, బెజవాడ చుండూరువారి కళాశాల లోను పనిచేసినారని విన్నాను. ఆంగ్లేయుల కాలంలో డిగ్రీలు లేకపోయినా, లబ్ధప్రతిష్ఠు లయిన పండితులకు ఉపాధ్యాయ పదవి

కల్పింపబడేది. బందరు హైస్కూల్లో శ్రీ చెళ్ళపిళ్ళవెంకటశాస్త్రిగారికి ఉపాధ్యాయ పదవి ఆ రీతిగా వచ్చిందే.

గుప్తగారికాలం ప్రాతకొత్తల సంధికాలం. ప్రాతకవులు చతుర్విధకవితా నిర్వాహకులు. క్రొత్తకవులు అలవోకగా తొలకరి జల్లులాగా పద్యాలు తేలికగా అల్లేవారు. శ్రీ చెళ్ళపిళ్ళవారు ఈ తేలికపద్యాలకు ఒరవడి దిద్దినవారు. అయినా ప్రాతపండితులు చప్పరిస్తారేమో అని, దేవీభాగవతం తెనుగు చేసినారు. నాటకాలు, శతకాలు, వచనాలు వ్రాసినారు. కల్పితకథాప్రబంధాలు వ్రాసినారు. గురువుగారి పద్ధతి దోమావారు కూడ అనుసరించినారంటే, వీరి అభిప్రాయం కూడ అదే అన్నిటిలో చేయిపెట్టి కృతహస్తుడనిపించుకోవాలని. మంచిదే కాని, అన్నీ అందరికీ ఒదిగిరావు.

సంఘోద్ధారక శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారు దోమావారి వాఙ్మయ భాండాగారం త్రవ్వి, వెలికిదీసి ప్రదర్శించుచున్నారు. ఈ మహాకార్యం జీర్ణదేవాలయోద్ధరణ కార్యంకంటె గరిష్ఠమైనది.

శ్రీ గుప్తగారికి పుమపత్యము లేదను కొఱతలేదు. సప్తసంతానములలో ప్రశస్తమైనది కృతి. గుప్తగారి కృతులలో శ్రీ కన్యకాపురాణము శిరోమణి. "శ్రీ కన్యకా పురాణము'...... విజ్ఞమనోజ్ఞప్రాకటతర సౌందర్యరసాకరము' అని ప్రథమాశ్వాసం 42 పద్యం. సౌందర్యరసాకరమంటే శృంగార రసాకరమన్నమాట. అమ్మవారు జగదేక సౌందర్య జన్మభూమిఅంతే. కథ విషాదాంతం. రాజు ఆ కన్యకను వలచినాడు. పెద్దలంగీకరించలేదు. ఆమె ఛీ పొమ్మన్నది. కనుక రసాభాసం. "ఏకత్రైవానురాగ శ్చేత్తిర్యజ మ్లేచ్ఛగతోపివా యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధా మతః' మరి శృంగారరసాకరమని యెందుకన్నారు? ఈ పురాణం కావ్యసౌందర్యం పుష్కలంగా కలిగిన కృతియని గుప్తగారి హృదయం కావచ్చు.

మూకపంచశతి శబ్దప్రౌఢి కల కృతి. తెనుగులో ఇముడదు. గుప్తగారు దాని తెనిగించినారంటే, అమ్మవారిమీద వారికి గల భక్తి కారణమని చెప్పవలెను.

గుప్తగారి రచనావిశేషాలు ఇదివరకే ప్రపంచించి చెప్పినాను కనుక, లోతుకు దిగి మరల చర్చించే పనికి పూనుకోను. ఒక ఆర్యకవి ఇన్ని అవధానాలు చేసి, ఇన్ని గ్రంథాలు వ్రాసి, గజారోహణ కవిగండ పెండేరాది మహాసత్కారాలు పొందినాడంటే సామాన్య విషయం కాదు. తెలుగుజాతి గర్వించదగిన విషయం.

(కడప-ఆకాశవాణి సౌజన్యంతో)

## శ్రీ మేడానరసింహులుగారికి షష్ఠ్యబ్దశాంతి

హైద్రాబాద్ పట్టణప్రముఖులూ, "నిర్మాణరత్నా"ది పలుబిరుదాంకితులూ, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య మాజీఅధ్యక్షులూ శ్రీ మేడానరసింహులుగారు తమకు అరవైఏండ్లునిండిన సందర్భంగా షష్ఠ్యబ్ద శాంతి మహోత్సవాన్ని జరుపుకొన్నారు. భాగ్య నగరము ఆనందకాలనీలోగల వీరి స్వగృహములో 5-2-1998 నుండి 7-2-1998వరకూ త్రయాహ్నికదీక్షతో ఈ శాంతికార్యక్రమం జరిగింది.

# ప్రధాన కార్యదర్శి నివేదిక

*(దోమావెంకటస్వామిగుప్తగారు గొప్ప అవధానులు. గుప్తగారు వైశ్యవంశసుదాబ్ధి చంద్రులు. ఈ పత్రికాసంపాదకులకృషితో, "శ్రీ దోమావెంకటస్వామిగుప్త సాహిత్య పీఠము" అనుపేర ఒక పీఠము 1991లో కడప పట్టణములో స్థాపించబడింది. ఈ పీఠము తరపున ప్రతియేడూ 1996నుండీ 'శ్రీ దోమావెంకటస్వామిగుప్త అవార్డు'ను ఇవ్వడం జరుగుచూ ఉంది. ఈ యేడు ఈ అవార్డు అష్టావధాని శ్రీ ఆశావాదిప్రకాశరావు గారికి లభించింది. 12-2-1998వ తేదీ గురువారం కడపపట్టణములోని సి.పి. బ్రౌను గ్రంథాలయభవనములో ఈ అవార్డు ప్రదానసభ జరిగింది. ఈ క్రిందిది ఆ సభలో వ్యవస్థాపకులుగా - 'ప్రధాన కార్యదర్శి'గా ఈ పత్రికాసంపాదకులు శ్రీ లక్ష్మీకాంతంశ్రేష్ఠి గారు చేసిన ప్రసంగ పాఠము)*

ఈ నా కార్యదర్శినివేదికను శ్రీ వెంకట స్వామిగుప్తగారు వ్రాసిన ప్రార్థనాపద్యము తోనే ప్రారంభిస్తున్నాను.

"శ్రీ కన్యా పరమేశ్వరీమణికి వే
చేతున్ నమోవాకముల్
వీకన్ సర్వజగన్నికాయ భరణా
వేల ప్రభావప్రభా
సాకారాత్మ నిరాకృతాత్మ
చరితవ్యాహార నీహారధా
రాకూలంకషకున్ సమస్తశుభ సం
ప్రాప్త్యర్థమై నిచ్చలున్"

సభాధ్యక్షులకూ, వేదికమీద వున్న పెద్దలకూ, సభలో వున్న మీ ఎల్లరకూ నా నమస్సులు.

దోమావెంకటస్వామిగుప్త గారు వ్యుత్ప న్నులైనకవులు. అత్యద్భుత ధారణాశక్తి గల అవధానులు. ఆశువుగా ఆయన పద్యం చెప్తుంటే వ్రాసుకొనేందుకే కష్టంగా ఉండేదట. గుప్తగారు ఆ కాలంలో బహుళ ప్రచారంలో వున్న సాహిత్య ప్రక్రియ లన్నింటిలో రచనలు చేశారు. 23 పద్య గ్రంథాలను, 9 వచన గ్రంథాలను, 5 యక్షగానాలను వ్రాశారు. రవీంద్రుని చిత్ర రచనను తెనిగించారు.

ఆయన తన జీవితకాలంలో 50 వేలకు పైబడి పద్యాలను వ్రాశారు మూడు వందలకు పైన శతావధానాలను చేశారు. ఆనాటి మన రాష్ట్రములోనేకాక పొరుగు రాష్ట్రాలన్నింటిలో కూడ గుప్తగారు శతావ ధానాలను, అష్టావధానాలను చేసి అనేక ప్రశంసలనూ, పలు స్వర్ణ పతకాలనూ అందుకొన్నారు. గజారోహణ, గండ పెండేరాది గౌరవాలనూ పొందారు. వీరు చేసిన ఈ సాహిత్యకృషికి గుర్తుగా ఈ పీఠాన్ని ఏర్పాటు చేశాము. కడపజిల్లా రిజిస్ట్రార్ గారి ఆఫీసులో ఈ పీఠము 1991లో 208 నెంబరుగా రిజిష్టరైంది.

కడపజిల్లాలో 'పీఠము' అనుపదము చివరగాగల తొలి సాహిత్యసంస్థ ఈ పీఠము. పెద్దనసాహిత్యపీఠము, పోతనసాహిత్య పీఠముల స్థాపనకు ఈ దోమావెంకట

స్వామిగుప్త సాహిత్యపీఠమే స్ఫూర్తి అని భావిస్తున్నాను.

గుప్తగారి ముద్రిత, అముద్రిత రచనలను ప్రచురించుట, గుప్తగారి రచనల మీద పరిశోధన చేయువారికి వీలైనంత ప్రోత్సాహాన్ని అందించుట, గుప్తగారిపేర స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేయుట, సాహిత్యంలో విశేష పరిశ్రమ చేసిన వారికి వెంకటస్వామిగుప్త అవార్డును ఇచ్చుట మొదలగునవి ఈ పీఠము యొక్క ప్రధానోద్దేశ్యాలు.

ఈ పీఠానికి రు.5,116/-లు ఇచ్చినవారు ప్రధానపోషకులు గాను, రు.1,116/-లు ఇచ్చినవారు మహారాజపోషకులుగాను, రు.516/-లు ఇచ్చినవారు రాజపోషకులుగాను, రు.216/-లు ఇచ్చినవారు పోషకులుగాను, రు.116/-లు ఇచ్చినవారు జీవిత సభ్యులుగాను ఉంటారు.

ఈ పీఠము తరపున, ప్రతియేడూ గుప్తగారు పరమపదించిన ఫిబ్రవరి 12న "వెంకటస్వామిగుప్త అవార్డు" అనుపేర ఒక అవార్డును ఇవ్వాలని నిర్ణయించాము. ఆ మా నిర్ణయాన్ని విని హర్షిస్తూ మద్రాసు వాస్తవ్యులు శ్రీ డి. సాయినాథ్‌గుప్తగారు, విజయాబాడీకేర్‌ప్రాడక్ట్స్ అధినేతలు శ్రీ సురేంద్రనాథ్‌గారూ తలకొక రు.1500-లు చొప్పున 5 సంవత్సరములు వరుసగా ఇచ్చుటకు అంగీకరిస్తూ ఈ తృతీయవత్సరానికికూడ వారిద్దరూ కలిసి రూ. 3000/-లు విరాళంగా పంపారు. ఉదారహృదయులైన పై ఇద్దరూ తమంతట తామే ముందుకు వచ్చి ఇచ్చిన మొత్తమును ఈ సభలో "తెలుగువెలుగు", 'కళాతపస్వి', 'అవధానికోకిల', 'అవధానాచార్య', 'అభినవసాహిత్య సోమయాజి' - ఇత్యాది బిరుదవిరాజితులు అష్టావధాని శ్రీ ఆశావాదిప్రకాశరావు గారికి ఈ పీఠము తరపున 'శ్రీ దోమావెంకటస్వామిగుప్త అవార్డు 1998'ని బహూకరించుటలో ఉపయోగించు కొంటున్నాం.

ఈ పీఠముయొక్క నిధికి సహకరించిన వారందరికీ పీఠము తరపున నా కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను. ఈ పీఠము వారిచే ముద్రించబడి - మరికొంతసేపటిలో ఈ సభలో ఆవిష్కరింప బడనున్న స్వర్గీయ గుప్తగారి శ్రీ కన్యకాపురాణ కావ్య ముద్రణకు ఇంతవరకు రు. 7340/-లు విరాళంగా వచ్చాయి. నంద్యాల వాస్తవ్యులు శ్రీ ఐ. రామయ్యగారు ఈ శ్రీ కన్యకాపురాణ ముద్రణకు రూ. 2500/-లు విరాళంగా ఇచ్చి సహకరించారు. శ్రీ కన్యకాపురాణ కావ్య ముద్రణకు సహకరించిన వారలకు ఈ పీఠము తరపున ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. ఈ పురాణ ముద్రణపై వచ్చే ఆదాయము పూర్తిగా ఈ పీఠముయొక్క అభివృద్ధికే వినియోగిస్తాము.

ఈ పురాణ విక్రయధర రూ. 100/-లు రూ.116/-లు ఇచ్చిన వారికి ఈ పురాణాన్నీ ఈ పీఠములో సభ్యత్వాన్నీ ఇస్తాము. ఈ కన్యకాపురాణ కావ్య ముద్రణా సమయములో అచ్చుతప్పులను దిద్ది, అవసరమైన సూచనలిచ్చి సహకరించిన డాక్టర్ సి.వి సుబ్బన్న శతావధానుల గారికి ఈ పీఠము తరపున కృతజ్ఞతలు సమర్పిస్తున్నాను.

ఈరోజు ఉదయం 'శ్రీ దోమావెంకటస్వామిగుప్త' - అను సరస్వతీపుత్రులు-డాక్ట

సి.వి.సుబ్బన్న శతావధానిగారి ప్రసంగాన్ని ప్రసారంచేసిన కడప ఆకాశవాణీకేంద్రము వారికి నా కృతజ్ఞతలు సమర్పిస్తున్నాను.

చదువలతల్లికి నిలయమైన ఈ బ్రౌను గ్రంథాలయభవనములో ఈ రోజు - మహావధాని శ్రీ దోమావెంకటస్వామిగుప్త గారి ఛాయాచిత్రపటాన్ని ఉంచుటకు అనుమతించిన ఈ బ్రౌనుగ్రంథాలయ సంఘం అధ్యక్షులు శ్రీ సి.కె.సంపత్‌కుమార్ గారికీ, కార్యదర్శులు శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారికీ ఇతర 'ట్రస్టు మెంబర్ల'కూ ఈ పీఠము తరపున కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాను.

తొలి తెలుగునిఘంటువు ఆంధ్రదీపిక తెలుగునిఘంటువు లన్నింటికీ ఈ ఆంధ్ర దీపికే ప్రాతిపదిక. ఈ నిఘంటువును వ్రాసిన వారు 'బాలాఘర', 'పండితరాయా'ది బిరుదాంకితులు స్వర్గీయ మామిడివెంకటార్యులవారు. ఆర్యులవారంటే బ్రౌనుకు చాలా గౌరవము. శారదాదేవి చిరు మువ్వలసందడి వినిపించే ఈ బ్రౌనుగ్రంథాలయభవనములో శ్రీ మామిడివెంకటార్యులవారి ఛాయాచిత్రపటాన్ని ఉంచుటకు అనుమతించవలసినదిగా ఈ బ్రౌనుగ్రంథాలయసంఘాధ్యక్షులనూ, కార్యదర్శులనూ ఇతర ట్రస్టుమెంబర్లనూ ఈ సభాముఖంగా కోరుచున్నాను.

స్వర్గీయగుప్తగారు వ్రాసిన పద్య గ్రంథాలన్నింటిలో అతి పెద్ద గ్రంథము బ్రహ్మవైవర్తపురాణము. ఈ పురాణాన్ని ముద్రించుటను గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాము. రెండు లక్షలపైగా వ్యయమౌతుందని అంచనా.

గుప్తగారు వ్రాసిన 'మూకపంచశతి'ని ముద్రించుటకు వీలుగా కంపోజ్‌చేసి ఉంచాము. ఆర్థికవనరులు సమకూరిన వెంటనే మూకపంచశతిని కూడ ప్రచురించాలనుకుంటున్నాము.

మా ఆహ్వానాన్ని మన్నించి ఇక్కడికి విచ్చేసి ఈ సాహిత్య పురస్కార కార్యక్రమములో పాల్గొనిన ఆహ్వానితులకూ శ్రోతలకూ నా నమస్సుమాంజలులు

జగన్మాత శ్రీ వాసవీదేవికి మరియొక సారి ప్రణామములు చేస్తూ మీ నుండీ సెలవు తీసుకొంటున్నాను.

## ప్రథమ సత్యాగ్రహి "వాసవి" చాలా ఉత్కృష్టంగా ఉంది

సంపాదకవర్యా!

శ్రీ వాసవీఆత్మార్పణదినోత్సవాన్ని పురస్కరించుకొని - కడపఆకాశవాణీ కేంద్రము వారు 30-1-1998వ తేదీ ఉదయం 7-30 గంటలకు ప్రసారం చేసిన మీ ఆకాశవాణీ ప్రసంగం "ప్రథమ సత్యాగ్రహి వాసవి" చాలా ఉత్కృష్టంగా ఉంది. మీరు ఆ ప్రసంగములో చాలా మందికి తెలియని పలు విషయాలను చెప్పారు పరిశోధకులకు ఎంతగానో ఉపకరించే విషయాలు కూడ అవి. వ్యాకరణబద్ధంగా సాగిన ఆ మీ ప్రసంగం అహింసా సూత్రమును పాటించుటవలన కలిగే ప్రయోజనాన్ని దివిటీపట్టి చూపింది వాసవిని - బుద్ధుణ్ణి సమన్వయపరచిన మీ తీరు బహుధా ప్రశంసనీయము ఆ వ్యాసాన్ని నాకు పంపండి నా 'పెన్షనర్స్ ప్రగతి' మాసపత్రికలో ప్రచురిస్తాను. ప్రతియేడూ ఇస్తున్న శ్రీ దోమావెంకటస్వామిగుప్త అవార్డుకు అష్టావధాని ఆశావాదిప్రకాశరావును కమిటీవారిచే ఎన్నిక చేయించడం మీ విశాలహృదయానికీ, మేధాసంపత్తిని గౌరవించగల మీ ఉదాత్తతకూ తార్కాణం.

బి. వెంకటసుబ్బయ్య,
ఎడిటర్, పెన్షనర్స్‌ప్రగతి
అనంతపురం. 30-1-98

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1998 ఫిబ్రవరి 21 నుండీ 1998 మార్చి నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 22 | మార్చి 1 | 8 | 15 | |
| సోమవారము | | 23 | 2 | 9 | 16 | |
| మంగళవారము | | 24 | 3 | 10 | 17 | |
| బుధవారము | | 25 | 4 | 11 | 18 | |
| గురువారము | | 26 | 5 | 12 | 19 | |
| శుక్రవారము | | 27 | 6 | 13 | 20 | |
| శనివారము | 21 | 28 | 7 | 14 | | |

ఫిబ్రవరి 22 - స్వామిదయానందసరస్వతీజయంతి

ఫిబ్రవరి 25 - మహాశివరాత్రి

ఫిబ్రవరి 28 :- పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1998 జనవరి నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి ఈ ఫిబ్రవరి 28లోగా చేర్చాలి

ఫిబ్రవరి 28 :- 1998 జనవరినెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితారీఖు.

మార్చి 4 :- పూర్వాభాద్రకార్తె రాక పగలు గం. 3-11 ని॥లు.

మార్చి 11 :- కామదహనం

మార్చి 12 :- హోళికాపూర్ణిమ

మార్చి 13 :- గురుమౌఢ్య నివృత్తి

మార్చి 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరితారీఖు.

మార్చి 17 :- ఉత్తరాభాద్రకార్తె రాక తె. 5.29

మార్చి 20 :- A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు

**22, 1, 8, 15 ఆదివారాలు**

*- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను*

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

పిదప, యాజ్ఞవల్క్యస గోత్రజుడైన పారదుడు లేచి, "ఈ పద్ధతిని భూమండలములో ఎక్కడా చూడలేదు. విననూలేదు. మీ వాదమును బలపరుచుటకు తగిన యోగ్యమగు ధర్మశాస్త్ర వచనమునో, వృద్ధాచారమునో తెలిపిన రాజుకు 'కన్యక'ను ఇచ్చెదము" అని ఖచ్చితముగా పలికెను.

ఆ మాటలు విని విజయసింహుడు కోపముతో " ఓ వైశ్యులారా! పంచమ వేదమగు భారతములో శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని క్షత్రియులలో ఉత్తముడగు యయాతి ధర్మపత్నిగా పొందిన విషయము మీకు తెలియదా? అట్టి రాజవంశమున అష్టదిక్పాలకుల కళలతో జన్మించి, మహాయోగ్యమైన నడవడిని కలిగిన మా విష్ణువర్ధనరాజు దేవుడే అని చెప్పుటకు సందేహము లేదు. సందేహమును విడిచి అభ్యంతరము చెప్పక ఆ వాసవీకన్యకను మా ప్రభువునకు ఇవ్వుడు" అని కోరెను.

37 1/2 - 41 అ.32 - పుట 339

మైత్రేయస గోత్రోద్భవుడూ, వివేకగుణ సంపన్నుడూ అయిన నాగశ్రేష్ఠి లేచి, చిఱునగవుతో, శుక్రాచార్యుల పుత్రిక అగు దేవయానిని శుక్రాచార్యుల అనుగ్రహముతోనూ, కచునిశాప కారణముతోనూ, శుక్రాచార్యుల అనుమతితోనూ యయాతికి భార్య అయినది. ఋషి అనుగ్రహముంటే అల్పమైనది కూడ మహత్తరమైనదే అగును. లేకున్న మహత్తరమైనది కూడ అల్పమైనది అగును. పైగా, శాపమును పొందిన దేవయానిని ఇక్కడ ఉదాహరణముగా చెప్పుట భావ్యముకాదు." అని మంత్రి వాదాన్ని ఖండించెను.

41 1/2 - 44 అ.32 - పుట 341

(ఆ తరువాత శ్రీ వత్సగోత్రమున జన్మించిన సోమశిష్ఠుడు లేచి, మంత్రీ! మీ రాజు కోరిక ఇప్పుడు మనము పాటిస్తున్న వర్ణాచారధర్మములకు విరుద్ధము. అట్టి అనుచితమైన కోర్కెను మీరు సమర్థించు కొనుచున్నందులకు చింతిస్తున్నాము.)

"విలోమ వివాహాలను మనువు సమర్థిస్తున్నాడు కదా?" అని మంత్రి విజయసింహుడు ప్రశ్నించెను.

"కలియుగమునకు పరాశరస్మృతి కదా? అనుసరణీయము" అని సోమశిష్ఠుడు సమాధానాన్ని ఇచ్చెను.

విష్ణువర్ధనునకు కన్యకను ఇవ్వవలయునా? లేదా? అను విషయము మీద, అందలి ఔచిత్యము మీద విస్తృతంగా చర్చ జరిగెను. విష్ణువర్ధనుడు కన్యకను కోరుట వర్ణాశ్రమాచారధర్మవిరుద్ధము. అసమంజసము. వాసవి గౌరబాలిక కనుక ఆమెను ఇతరులకు ఇచ్చి వివాహము చేయుటకు వీలులేదు - అని ఆ సభ చివరకు

తీర్మాణించెను. విక్రమసింహుడు విషయమును, ఆ విషయముపై జరిగిన చర్చల తీరును గమనించి, కుసుమశ్రేష్ఠీ! ఈ విషయములో మీ నిర్ణయమును తెల్పుము. మీ నిర్ణయానికై మా రాజు ఎదురుచూస్తూ ఉంటాడు. ఇప్పటికే ఆలస్యమైంది. నేను వెళ్ళాలి అనెను.

"మంత్రీ! మీ రాజు కోర్కె ధర్మవిరుద్ధమైనదీ, అసమంజసమైనదీ అని సభలోని వారంతా ఏక వాక్యముతో పలుకగా నా నిర్ణయము మాత్రము ందుకు విరుద్ధముగా ఎట్లుండును" అని చెప్పెను.

కుపితమనస్కుడై విక్రమసింహుడు సభ నుండీ నిష్క్రమించి, తన రాజగు విష్ణువర్ధనుని వద్దకు వెళ్ళి కుసుమశ్రేష్ఠి నిర్ణయమును చెప్పెను.

మంత్రి మాటలు రాజునకు ఆగ్రహాన్ని కలిగించినవి. వెంటనే వెళ్ళి కుసుమశ్రేష్ఠిని బంధించి, కన్యకను ఎత్తుకొని రండు - అని కోపముతో పలికెను.

ఆ మాటలు విని, ఆయన పరివారములోని కొందరు మంత్రులు, పెద్దలు "రాజా! మనము తొందరపడకూడదు.ఎందుకైననూ మంచిది. కుసుమశ్రేష్ఠికి కొంతగడువును ఇచ్చి తన నిర్ణయమును మార్చుకొమ్మని చెప్పి చూచెదము. అంతకునూ ఆయన నిర్ణయములో మార్పురాకున్న కుసుమగుప్తుని బంధించి, కన్యకను తీసుకొని వెళ్ళుదము. ఎవరికైననూ దండము చివరిది కదా?" అని చెప్పిరి.

వారి ఆ మాటలను విన్న విష్ణువర్ధన నృపాలుడు క్షణకాలము ఆలోచించి 'సరే' అని తన అంగీకారమును తెల్పెను.

ఆ తరువాత ఈ విషయమును మరికొంత వివరముగా చర్చించి, ఒక భటున్ని పిలిచి, "ఓయీ! నీవు కుసుమశ్రేష్ఠి వద్దకు వెళ్ళి, మీ నిర్ణయము మా రాజుకు తృప్తిని కలిగించలేకపోగా కోపమును తెప్పించినది. అయినా మా రాజు సహనశీలుడు కనుక మీ జవాబుకు ఆగ్రహించియూ, క్షణకాలమునకు శాంతించి మీకు ఒక నెలరోజులు గడువు ఇచ్చెను. మరియొకసారి మీ నిర్ణయమును తిరిగి ఆలోచించి మా రాజు కోరిన విధంగా మా రాజుకు కన్యకను ఇచ్చి వివాహము చేయుడు. లేకున్న మా రాజు సైన్యసమేతముగా వచ్చి మీ పెనుగొండ పట్టణాన్ని భస్మము చేసి మిమ్ము బంధించి, కన్యకను తీసుకొనివెళ్ళి పరిణయమాడగలడు. రాజులతోనూ, బలవంతులతోనూ వైరము శ్రేయస్కరముకాదు" అని చెప్పి, రమ్మని పంపిరి.

రాజు సైన్య సమేతుడై పెనుగొండ నుండి బయలుదేరి కతిపయ దినములకు తన పట్టణమగు 'పద్మశయన' పురమును చేరుకొనెను.

ఇది స్కాంధపురాణమందు - సనత్సుజాతీయ సంహితగల ఉత్తరఖండము - రాజు కోరికను కుసుమగుప్తుడు తిరస్కరించుట - గడువునిచ్చి వెడలిపోవుట - పదునాల్గవ అధ్యాయము

## పదునైదవ అధ్యాయము

విష్ణువర్ధనుని వార్త కుసుమార్యుని ఆవేదనకు గురిచేసెను. ఏ వర్ణాశ్రమాచార ధర్మానుసరణను తన ప్రాణప్రథమంగా భావించుకొంటున్నాడో ఆ వర్ణాశ్రమాచారములకే భంగము కలిగించుటకు ఆయన

మనస్సు అంగీకరించలేదు. విలోమ వివాహానికి తానేకాదు. తనవారంతా, పదునెన్మిది పట్టణాల ప్రభువులూ సమ్మతించలేదు. విష్ణువర్ధనుడు పట్టుదలతో ఉన్నాడు. ధర్మవిరుద్ధమైన ఆ రాజుకు తగినబుద్ధి చెప్పగల శక్తి తనకు ఉంది. తన సైనికులు అరివీరభయంకరులు. తన సైన్యాధిపతులు వ్యూహనిర్మాణములో సాటిలేనివారని ప్రతీతిని పొందారు. ఇక, బాలనగరులా? వారు సింహకిశోరాలు. ఖడ్గచాలనములోనూ, శరసంధానములోనూ కూడ అసామాన్య ప్రతిభగలవారలు. విష్ణువర్ధనుడు పంపిన యీ వార్తను వింటే ఆ బాలవీరులు ప్రలయకాలరుద్రులే అవుతారు. వారిని శాంతపరచడం కూడ అతికష్టమే.

వాసవి శాంతినే కాంక్షిస్తూంది. రక్తపాతానికి అంగీకరించలేదు. తన రాజ్యములోని ప్రజలు శాంతికాముకులుగా, ధర్మాచరణులుగా ఉండి, మోక్షసామ్రాజ్యాన్ని అందుకోవలెను. నిత్యము సత్యప్రియులుగా ఉండవలెను. రక్తరహితమైన శాంతిసత్యాగ్రహమునే ఈ భూమికి అందించాలనీ, అహింసయే పరమధర్మము అను వాక్యానికి సరియైనఅర్థాన్ని ఆచరణలో చూపాలనీ ఆమె ఎప్పుడూ ప్రయత్నిస్తూఉంది.

కన్యకను రాజునకు ఇచ్చుటకు తన మనస్సు ఏ విధంగానూ అంగీకరించలేదు. విష్ణువర్ధనుడు దుర్మార్గంగా ప్రవర్తిస్తున్నాడు.

పరస్పర విరుద్ధములైన ఈ భావనలతో కుసుమగుప్తుడు సతమతమాయెను. ఆయన అంతరంగములో పై రెండింటికీ సంఘర్షణ జరగడం ఆరంభమాయెను.

ఇంతలో అక్కడికి వాసవి వచ్చెను. ఆమె, తన తండ్రి విషణ్ణవదనుడుగా, ఏదో పరిష్కరించుటకు సాధ్యముకాని సమస్యతో ఆందోళన పడువాడుగా ఉన్నట్లు గమనించెను.

"నాన్నా! ఎందుకు మీరీ విధంగా ఆందోళన పడుచున్నారు. మీ అంతరంగములో ఏదో సంఘర్షణ జరిగినట్లు కన్పిస్తూ ఉంది." అని అడిగెను.

కుసుమగుప్తుడు క్షణకాలము మౌనముగా ఉండెను. వాసవి అయమ్మ తిరిగి ప్రశ్నించెను. చివరకు చెప్పక తప్పని పరిస్థితిగా ఆయనకు కన్పించెను. పొంగిపొరలి వస్తున్న దుఃఖాన్నీ, ఆవేదననూ లోపలనే అణచుకొని ఇట్లు చెప్పెను.

"తల్లీ! నిన్నటి దినం మన పట్టణానికి వచ్చిన విష్ణువర్ధనుడు నిన్ను పరిణయమాడాలని కాంక్షించెను. ఆ మాటే తన మంత్రి విక్రమసింహునితో చెప్పి పంపెను. "ధర్మవిరుద్ధమైన ఆ కోర్కెను నేనూ, మనవారు, పద్దెనెమిది పట్టణాల ప్రభువులు, వర్ణాశ్రమాచార ధర్మవిరుద్ధమైన యీ రాజు కోర్కెను మేము అంగీకరించము. ఇది మంచిదికాదు". అని గట్టిగా చెప్పితిమి. అయినా ఆ రాజు తన కోర్కెను వీడక ఒక్కనెలరోజుల గడువును ఇస్తున్నాను, అప్పటికీ కన్యకను ఇవ్వకున్న సైన్యసమేతంగా వచ్చి, నన్ను బంధించి వాసవిని బలవంతంగా తీసుకొనిపోతాను అని చెప్పి పంపి తన పద్మశయన పురమునకు వెళ్ళెను. ఆతని హుంకరింపులకు భయపడికాదు నేను ఈ విధంగా ఆందోళన పడుట. ఆతన్ని ఎదుర్కొని, ఆతనికి తగిన శాస్తిని చేయగల సమర్థత, బలములు మనకు లేకపోలేదు.

అయితే మనము ఇంతవరకు అనుసరిస్తున్న అహింసాసిద్ధాంతానికి అది భంగము కలిగిస్తుంది. నీ ఆలోచనకు విఘ్నము కలిగిస్తుంది." అని చెప్పెను.

ఆ మాటలు విని 'వాసవి' నవ్వింది. తండ్రీ ఎందుకింత ఆలోచన చేస్తావు. విష్ణువర్ధనుని కత్తితో ఎదుర్కొనడం అంటే, హింసను ఆహ్వానించడమే కాదా?. మనము ఇన్ని దినాలు, ఇంతగా ప్రయత్నము చేసింది ఇందుకేనా? మన జీవితలక్ష్యానికి మనము భంగము కలిగించుకోవడమా? ప్రాణుల సుఖదుఃఖాలకు ఎవరు కర్తలు? సర్వమూ ఆ జగదంబ 'కన్యకాంబ' ఆధీనము. ఆ తల్లి సంకల్పం లేకుండా చలిచీమ కూడ కుట్టదుకదా? ఒక విష్ణువర్ధనుని వల్లనే కాదు, వేలాదిమంది విష్ణువర్ధనులవల్ల కూడ మన లక్ష్యసాధనకు భంగము కలుగదు. ఈ పుడమిపై ఇప్పుడిప్పుడే చిగురిస్తున్న శాంతిసత్యాలకు మనమే భంగము కలిగించకూడదు. ప్రాణములు ఇచ్చి అయినా సరే, మనం లక్ష్యాన్ని సాధించాలి. తండ్రీ! బాగా ఆలోచించండి. ఇది నా మూలంగా వచ్చిన కష్టము. నా వల్లనే పరిష్కారం కావలెను. మీరు ఎవ్వరూ అందువలన బాధితులు కాకూడదు. జరుగనున్నది జరిగేతీరును. మీరు భయపడకుడు. ఆందోళన చెందకుడు.

(ఇంకావుంది)

# నిరంతరగ్రంథాలయసేవకులు "శ్రీ చుండూరిఅప్పారావు"





గ్రంథాలయసేవే జీవితపరమావధిగా అర్థశతాబ్దికి అటూ - యిటుగా గ్రంథాలయసేవలోనే పునీతులగుచున్న నిరంతర గ్రంథాలయసేవకులు శ్రీ చుండూరి అప్పారావుగారు.

స్వగ్రామమైన రావెలలో 'ఆంధ్రాభ్యుదయగ్రంథాలయము' - అనుపేర కొంతమంది మిత్రులతో కలిసి గ్రంథాలయాన్ని స్థాపించుటతో వీరు తన గ్రంథాలయసేవకు శ్రీకారం చుట్టారు.

అప్పారావుగారు 1931వ సంవత్సరం సెప్టెంబరునెల 4వ తేదీన గుంటూరు జిల్లా తెనాలి తాలూకా 'రావెల' గ్రామములో జన్మించారు.

తల్లి అన్నపూర్ణమ్మ, తండ్రి రాఘవయ్య. 1956లో వయోజన ఉపాధ్యాయశిక్షణనూ, గ్రంధాలయశిక్షణనూ విజయవాడలో పొందారు. 1957 నుండీ 1969 వరకూ దాదాపుపండ్రెండుసంవత్సరాలు గుంటూరు తాలూకా గ్రంథాలయసంస్థకు కార్యదర్శిగా ఉన్నారు. 1969లో గుంటూరు పట్టణములో ఆంధ్రప్రదేశ్‌గ్రంధాలయ శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. 1970లో శ్రీరావు గారిని ఆ సంస్థ తనకు అధ్యక్షులుగా ఎన్నుకొంది. 1981 వరకూ వీరు ఆ పదవిలో ఉండి ఆ సంస్థమరింతగా విస్తరించుటకు శక్తికొలదీ కృషిచేశారు. 1970లో 'ప్రగతి' అను గ్రంథాన్ని రావుగారు ప్రకటించారు. ఈ గ్రంథము పూర్తిగా గుంటూరు తాలూకా గ్రంధాలయ పురోగతిని తెలియ జేయునట్టిది. 1956, 1957 సంవత్సరాలలో - స్వాతంత్ర్యసమరయోధులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షులుగా ఉన్నకాలములో - ఆంధ్రప్రదేశ్‌గ్రంధాలయ కేంద్ర కార్యాలయములో కార్యాలయ కార్యదర్శిగా పనిచేశారు. 1971లో గుంటూరుజిల్లా గ్రంధాలయ సంస్థకు కార్యవర్గసభ్యులుగా ఎన్నికయ్యారు 1977 నుండీ 1979 జూలైవరకూ తమ స్వగ్రామమైన రావెలలో పుస్తకపంపిణీ కేంద్రమునకు గౌరవనిర్వహణాధికారిగా పనిచేశారు 1956 నుండీ పదిసంవత్సరాలు గ్రంథాలయ వార్షికోత్సవాలను నిర్వహించిన రావుగారు విజయవాడ నుండీ వెలువడిన 'గ్రంథాలయసర్వస్వము' అను మాసపత్రికకూ - స్వర్గీయ పండితశ్రీజమిళి

నమ్మాళ్వార్ గారి సంపాదకత్వమున గల 'గుంటూరుపత్రిక'కూ - 'గుంటూరు న్యూస్'- అను పత్రికకూ - అప్పారావుగారు ఉప సంపాదకులుగా పని చేశారు.

శ్రీ గాడిచర్లహరిసర్వోత్తమరావు, గ్రంథాలయపితామహులు -శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, ప్రముఖ కాంగ్రెసు నాయకులు, శ్రీ చెరకువాడవెంకట నరసింహం, గోపిరాజురామచంద్రరాజు (గోరా), ప్రకృతిచికిత్సానిపుణులు శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మ, స్వాతంత్ర్యసమర యోధులు శ్రీ వావిలాలగోపాలకృష్ణయ్య గారల వంటి పెద్దలను రావెలకు ఆహ్వానించి, వారిచే ఉపన్యాసాలిప్పించారు. 1961లో రావెల గ్రామవాస్తవ్యులు శ్రీ పోనపాటినాగేశ్వరరావుగారి అవధానకార్యక్రమాన్నీ, 1962లో శ్రీమతి త్రిపురనేని సాధువమ్మగారి బుద్ధచరిత్ర బుర్రకథా కార్యక్రమాన్నీ రావెలలో ఏర్పాటుచేశారు.

శ్రీ అప్పారావుగారు కేవలం గ్రంధాలయ సేవకులే కాదు. సర్వోదయసేవకులుకూడ. విజయవాడలోని 'గాంధీస్మారకనిధి' కేంద్రములో 1976వ సంవత్సరములో 'ఉప సంచాలకులు'గా పనిచేశారు.

1976వ సంవత్సరములో "రావెలగ్రామ ఆర్యవైశ్యసంఘము"ను ఏర్పాటు చేశారు.

వివిధ దినపత్రికలకు వార్తలుపంపుచూ, పలుదిన పత్రికలను విక్రయిస్తూ పత్రికా రంగానికికూడ తనసేవలను అందిస్తూన్న వీరు రావెలలోని శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయానికీ, శ్రీ దాసాంజనేయస్వామి ఆలయానికీ 1979 నుండీ 1997 వరకూ పద్దెనిమిది సంవత్సరాలు ధర్మకర్తగా భగవత్సేవజేసి జీవితాన్ని పావనం చేసుకొన్నారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయము నుండీ బి.ఏ., డిగ్రీని పుచ్చుకొని ప్రభుత్వ ఆరోగ్యశాఖలోనూ, పంచాయితీరాజ్‌శాఖలోనూ, సహకారశాఖలోనూ ఉద్యోగిగా పనిచేసి ప్రస్తుతం రావెలలో విశ్రాంతి తీసుకొంటున్న అప్పారావుగారికి ముచ్చటగా ముగ్గురు కుమారులు.

అప్పారావుగారు తన పదహారేండ్ల వయస్సులో అంటే 1947లో భక్త మార్కండేయ నాటకములో నారద పాత్రనూ, లవకుశ నాటకములో లవ కుమార పాత్రనూ, 1955లో 'మూఢున్నర వజ్రము' అను పౌరాణిక నాటకములో ఒక ముఖ్యపాత్రనూ పోషించి తనలోని నాటక కళాసక్తిని ప్రకటించుకొన్నారు.

నిరాడంబరంగా, నిగర్వంగా పలు రంగాలలో పరిశ్రమించి, దేశసేవ, భాషా సేవ, స్వసంఘసేవ చేసిన రావుగారివంటి వ్యక్తులు ఇంకా ఎందరో వైశ్యసంఘములో ఉన్నారు. అయితే వీరిలో చాలామందికి ప్రచారం చేసుకోవడం నచ్చదు. ఆత్మను అమ్ముకోడానికి అంగీకరించరు. వీరిలో పలువురు నిర్ధనులు. అందువలన ధన బలాన్ని చూపించడమూ, సమయానుకూలంగా విధేయతను ప్రకటించుకోవడమూ మొదలగు వాటికే ప్రాధాన్యత ఇస్తూ సమర్ధతకూ - విషయగ్రహణకూ- నిపుణత్వానికీ విలువ నివ్వని ఈనాటి వైశ్యసంఘనాయకుల దృష్టికి అప్పారావు గారి వంటి నిరాడంబరులు రాకపోవడం విడ్డూరముకాదు. కానీ నాయకుల ఈ భావనలు వైశ్యజాతి పతనానికి నాందీ పలుకుతాయి.

# గదర్‌వీరుడు "దర్శిచెంచయ్య గుప్త"




- శ్రీ జి. శ్రీరాములు, గూడూరు.

(1887 ప్రథమభారతస్వాతంత్ర్య సంగ్రామం స్మృత్యర్థంగా విప్లవపార్టీకి 'గదర్‌పార్టీ' అని నామకరణం జరిగింది. ఆ విప్లవపార్టీలో చేరిన ఏకైక ఆంధ్రుడు స్వర్గీయ దర్శిచెంచయ్యగుప్తగారు. దేశ స్వాతంత్ర్య అవసరాన్ని గాంధీగారికన్న ముందుగా గుర్తించిన దేశభక్తులు చెంచయ్యగుప్తగారు.. అరవైసంవత్సరాల వయస్సు వరకు ప్రజాఉద్యమాలనే పరమావధిగా తలంచి జీవితసమరం నడిపిన విప్లవవీరుడు చెంచయ్యగుప్తగారు. వారి జీవిత విశేషాలే ఈ వ్యాసము.

నెల్లూరుజిల్లా గూడూరులోని ప్రభుత్వ కళాశాలలో హిందీభాషోపన్యాసకులుగా పనిచేస్తున్న శ్రీ గాధంశెట్టిశ్రీరాములుగారు ఈ వ్యాసాన్ని వ్రాశారు. సరళమైన పదాలతో చిన్న వాక్యాలతో తాను చెప్పదలచుకొన్న భావాన్ని సూటిగా పాఠకుల హృదయాలకు అందించే రచయిత శ్రీ శ్రీరాములుగారు. స్వర్గీయ గుప్తగారి దేశభక్తిని, కర్తవ్యనిష్టను, స్వేచ్ఛాప్రియత్వాన్ని, ధైర్యసాహసాలను ఒకేచోట కుప్పబోసి పాఠకులకు అందిస్తున్నారు ఈ వ్యాసంలో ఈ రచయిత -- సంపాదకులు).

భరతమాత దాస్యశృంఖలాలను ఛేదించటానికి నడుము బిగించిన బహుకొద్ది మంది ఆంధ్రులలో స్వర్గీయ దర్శిచెంచయ్యగుప్తగారూ ఒకరు. దేశంలో వుంటూ దేశ స్వాతంత్ర్యపోరాటంలో కొనసాగలేక విదేశాల్లో ఆశ్రయమేర్పరచుకొని తమ లక్ష్యసాధనకు ప్రపంచ ప్రజల మద్దతు సంపాదించిన విప్లవయోధుల్లో చెప్పుకోతగినవ్యక్తి మన చెంచయ్యగారు. బ్రిటీష్ వారి పరిపాలనాకాలంలో స్వాతంత్ర్య పోరాటం తారాస్థాయినందుకొన్న రోజుల్లో బాల్యంనుంచే తనకంటూ ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకొని ఆ లక్ష్యసిద్ధికొరకు ప్రాణాలను సహితం లెక్కచేయకుండ పోరాడిన ధీశాలి. 'గదర్‌పార్టీ' అధినేతగా చరిత్ర పుటలకెక్కిన వీరుపురుషుడు. అరవై సంవత్సరాల వయస్సువరకు ప్రజాఉద్యమాలనే పరమావధిగా తలంచి జీవితసమరం నడిపించిన చెంచయ్యగారు మంచివక్తలే గాకుండా చక్కని రచయితలుకూడా.

ప్రకాశంజిల్లాలోని కనిగిరి గ్రామాన జన్మించి పెరిగి పెద్దవాడైన ఈయన తన పోరాటకాలంలో ఎక్కువగా విదేశాల్లోనే వుండిపోయాడు. స్వదేశంలో వున్నకాలం ఎక్కువగా జైళ్ళలోనే గడిచింది. చివరి దశలో మద్రాసు మహానగరంలో స్థిర నివాస మేర్పరచుకొని వృద్ధాప్యమంతా రచనావ్యాసంగంతోనూ, సంఘసంస్కర్తగాను గడిపారు.

ఉత్తరభారతాన వైశ్యకులంలో జన్మించిన మహాత్మాగాంధీగారు 1920 ప్రాంతములో భారతదేశ క్రియాశీలక రాజకీయాల్లో పాల్గొంటే, దర్శిచెంచయ్య గారు 1919కే బోలెడంత రాజకీయ అనుభవం సంపాదించి అనేకమార్లు జైలు జీవితం చవిచూచి విడుదలయ్యారు. ఆయన శాంతికాముకుడైతే ఈయన విప్లవవాది. దేశస్వాతంత్ర్య అవసరాన్ని ఆయనకంటే ఈయనే ముందుగా గుర్తించాడు. కానీ ఉభయుల సాధనా మార్గాలు భిన్నమైనవి. అయినా గాంధీ గారితో కలసి పనిచేసే అదృష్టం తనకు కలిగినందులకు తానెంతో సంతోషించి నట్లు చెంచయ్యగారు తమ ఆత్మకథలో చెప్పుకున్నారు.

చెంచయ్యగార్ని గురించి ఆయన స్వగ్రామమైన కనిగిరిలో ఇప్పటికీ కొన్ని సంఘటనలు ముచ్చట్లుగా చెప్పుకుంటూ వుంటారు. ఆయన విదేశాల్లో వున్నప్పుడు ఇక్కడవున్న తన బంధువుకు ఒక ఉత్తరంలో "తెల్లమాత్రలు ఖర్చు తక్కువ, నల్లమాత్రలు ఖర్చు ఎక్కువ"అని రాశారనీ అందుపైన స్వదేశానికిరాగానే ఆయన్ను ప్రభుత్వం అరెస్టు చేసిందని చెప్పుకుంటూ ఉంటారు.

చెంచయ్యగారు తనజీవితంలో తార సిల్లిన కొన్ని ముఖ్యమైన సంఘటనలను భావితరాలవారికి ప్రేరణగా సమకూర్చి "మీరూ - నేను" పేరుతో ఒక కథల సంపుటిని 1958లో ప్రచురించారు. అందలి భూమికలో ఆయన ఇలా వ్రాశారు.

"ఇది ఒక సాహసకార్యము. కథలు వ్రాస్తానని అనుకోలేదు. అలాంటిపనికి అభ్యాసము చెయ్యలేదు. సుమారు అరవైసంవత్సరాల వయస్సురాగానే బల హీనత, ముసలితనమ్ము, అనారోగ్యము బాధించటం ప్రారంభించాయి. ఇక కష్టమైన పనులు సాధ్యపడవని తీర్మానించుకొని ప్రజాఉద్యమాలను మానుకొని జీవితాన్ని శాంతంగా గడపడం ప్రారంభించాను. అదివరకు నేను చదువని విషయాలను గురించి చదువడం ప్రారంభించాను. ముఖ్యంగా ఇంగ్లీషులో ఎన్నో చదివాను.

నా కథలు నా అనుభవాలే. 1907వ సంవత్సరంలో విద్యార్థిదశలో నన్ను చాలా కలవరపెట్టిన దుఃఖకరమైన ఒక గోషాస్త్రీ కష్టాలను "తెరమరుగున" అనే కథలో వ్రాశాను. ఇలాగే 1950 వరకూ నన్ను కలవరపెట్టిన, సంతోషపెట్టుచుండిన కథ లను వ్రాశాను. నా కథలు "జనవాణి", "విశాలాంధ్ర", "ఆంధ్రవాణి", "ఆనంద వాణి", "దివ్యజ్ఞానము" మున్నగు పత్రిక లలో ప్రచురింపబడ్డాయి".

తన కథలన్నీ ఇంగ్లీషులో వ్రాయబడి నట్లు, శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ వాటిని తెలుగు లోనికి అనువదించినట్లు చెంచయ్యగారు తెలిపారు. కనుక ఈయన ఆంగ్లభాషా పరిజ్ఞానము ఎంత పరిపక్వత కలిగినదో తెలుస్తూంది.

ఏ రచయిత అయినా తన మనో భావాలనే తన రచనలందు పరోక్షంగా వ్యక్తపరుస్తూ వుంటాడు. అందులోనూ చెంచయ్యగారి కథలు స్వానుభవంతో కూడిన యదార్థ సంఘటనలు గనుక అనేక సందర్భాలలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమస్యలను గురించి ఆయన అభి ప్రాయాలు ఆయన రచనలందు తొంగి చూస్తూ వున్నాయి. ఆయన రచనల ఆధారంగా ఆయన 1907వ సంవత్సరంలో ఒంగోలు హైస్కూలులో చదువుకున్నారు.

కోయంబత్తూరు జైలులో ఒక బెంగాలీ టెర్రరిస్టుతో ఈయనకు స్నేహం కుదిరింది, వేశ్యలకు వివాహాలు జరిపించడములో, విధవరాళ్ళకు పునర్వివాహాలు జరిపించడంలో ఎంతో శ్రమపడ్డారు.

**కుటుంబ పరిచయము**

స్వర్గీయ చెంచయ్యగుప్త గారు 1885వ సంవత్సరములో ఇప్పటి ప్రకాశం జిల్లాకు చెందిన కనిగిరి గ్రామంలో జన్మించారు. ఒంగోలులోని ఉన్నత పాఠశాలలో చదువుకొన్నారు. తండ్రి సుబ్బయ్యశ్రేష్ఠి తల్లి మహాలక్ష్మమ్మ. ఆయన మొదటి భార్య పేరు శ్రీమతి అన్నపూర్ణమ్మ. ఈమె చనిపోగా సుభద్రమ్మ అనేపేరుగల ఒక బ్రాహ్మణ వితంతువును ద్వితీయ కళత్రంగా వివాహం చేసుకొన్నారు. ఈమె ఒకమంచి "కామ్రెడ్'. ఇటీవలే ఈమధ్య ఈమె మద్రాసులో చనిపోయింది. చరమ దశలో ఆయమ మద్రాసులోని ప్రభుత్వ సార్వజనిక వైద్యశాలలో చికిత్సపొందు చుండగా కమ్యూనిస్టుపార్టీ ఆమెకు కావలసిన వసతులను సమకూర్చింది. ఈమె మద్రాసులో పేరున్న న్యాయ వాదికూడ. వీరి స్వగృహము ఇప్పటికి మద్రాసులో వుంది.

గుప్తగారి పెద్ద తమ్ముడు శ్రీ గురుస్వామి శ్రేష్ఠిగారు ఇనుపవ్యాపారం చేస్తూ వృద్ధాప్యంలో చనిపోయారు. రెండవ తమ్ముడు రంగయ్యశ్రేష్ఠిగారు జిల్లా న్యాయమూర్తులుగా ఉంటూ పదవీ విరమణ చేసి వృద్ధాప్యంలో చనిపోయారు. కుమారులు లేరు. ఇద్దరు కూతుల్లు. పెద్ద కుమార్తె డాక్టర్ లలిత, యం.బి.బి.యస్., మద్రాసు రాష్ట్రములోని నైవెల్లిలో డాక్టరుగా వుంటూ ఇటీవల 'రిటైరు'అయ్యారు.రెండవ కుమార్తె శ్రీమతి కోమల, బి.యస్.సి., ఈమె భర్త డాక్టర్ సి.సుబ్బరాయుడుగారు హైద్రాబాద్‌లో అడిషనల్ డైరెక్టర్ ఆఫ్ మెడికల్ అండ్ హెల్త్ సర్వీసులో ఉండినారు.

**రాజకీయ అనుభవాలు**

"ఉరికంబము" అను పేరుగల వ్యాసంలో ఆయన వ్రాసుకొన్న ఈ క్రింది చారిత్రక అంశాలు పరిశీలిస్తే ఆయన రాజకీయ అనుభవాలు, త్యాగాలు, సాహస కృత్యాలు పాఠకులను ఆశ్చర్యచకితులను చేస్తాయనుటలో సందేహంలేదు.

"ఉన్నత విద్యనభ్యసించేందుకు నేను 1912లో అమెరికా వెళ్ళాను. అక్కడ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చేరాను. ఆ సమయంలో అక్కడ దాదాపు 30మంది భారతీయ విద్యార్థులు విద్య నభ్యసిస్తూవున్నారు. విదేశీ బానిసశృంఖాల నుండి భారతదేశ విముక్తిని సాధించడం ఎలా? అన్న సమస్యపై మేమంతా తీవ్రంగా చర్చిస్తూవుండే వాళ్ళం. భారతదేశ విముక్తిని సాధించాలంటే విప్లవపార్టీనొకదాన్ని స్థాపించ వలసిందేనని బెంగాల్ టెర్రరిస్టునాయకుడు శ్రీ లహరీ సూచించాడు. 1887 ప్రథమ భారతస్వాతంత్ర్యసంగ్రామం స్మృత్యర్థం విప్లవపార్టీకి "గదర్ పార్టీ"అని నామకరణం జరిగింది. గదర్ పార్టీలో నేనుకూడ చేరాను. అమెరికా, కెనడా దేశాల్లో వున్న అనేక మంది భారతీయులు ఈ కొత్తపార్టీలో సభ్యత్వం స్వీకరించారు.

(ఇంకావుంది)

*(వైశ్యవైజయంతికినుండి)*

## శ్రీ మేడంవిశ్వనాథంగారి నూతన గృహప్రవేశం

అనంతపురంజిల్లా కళ్యాణదుర్గం పుర ప్రముఖులు శ్రీ మేడంవిశ్వనాథంగారు సదరు పట్టణం మైన్‌బజారులో తాము నిర్మించుకొన్న నూతన భవనం 'శ్రీ బాలాజీ నిలయము'లో 6-2-1998వ తేదీన ప్రవేశించారు.

అన్నదానమునకు 1. రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు 2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోట్లో వేయబడును 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక బీముకు ఒక సైడు పేరు, ఫోటో వేయబడును. లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 15 రోజులు రూము యివ్వబడును. కొద్దిమందికి మాత్రమే అవకాశము.

రు 2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరిపబడును

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10 95 నుండి నిత్య భోజనములు, తాత్కాలికముగా వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించబడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును.

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును.

రు.1116/-లు సమర్పించినవారికి వారి పోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు 1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్ధన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును. కొద్దిమందికి తిరుమలలో కూడా 15 రోజులు రూము కేటాయించబడును

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6: **శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు** పై క్రతువ

జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును. మొదటి రోజు శ్రీమన్నారాయణుడు దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువ ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1 రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.

2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యి సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

3. రు 2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని అయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయి చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోరాము.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠము ఒకటి కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రీకులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయములగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.2.98 నుండి 20.3.98 వరకు)

చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి మార్చి నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కుద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఫిబ్రవరి నెల 20వ తేదీనగానీ, అంతకుముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1998 జనవరి నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును, అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ ఫిబ్రవరి 28వ తేదీలోగా చేర్చాలి.

1998 జనవరి నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వనెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ ఫిబ్రవరి నెల 28వ తేదీలోగా చేర్చాలి

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.